**Meraj Ka Safarnama - Paigham**
**(Telugu)**

# మేరాజ్

## యాత్ర, సందేశం

రచన

**మౌలానా సయ్యద్ అబుల్ అలా మౌదుదీ (రహ్మాలై)**

అనువాదం

**ఎస్.ఏ.ఆదిల్, యం.డి. ఉస్మాన్ ఖాన్**

అపార కృపాశీలుడు పరమ కరుణామయుడు అల్లాహ్ పేరుతో

# మేరాజ్ యాత్ర

మహా ప్రవక్త ముహమ్మద్ (సల్లం) జీవితంలో జరిగిన సంఘటనల్లో అత్యంత ఖ్యాతి గడించిన సంఘటన మేరాజ్ సంఘటన. ఈ సంఘటన హిజ్రత్‌కు ఒక సంవత్సరానికి పూర్వం రజ్జబ్ నెల 27వ తేదీ సాయంత్రం జరిగిందని పలు ఉల్లేఖనాల ద్వారా తెలుస్తుంది. దీని ప్రస్తావన ఖుర్‌ఆన్‌లో ఉంది, హదీసులో కూడా ఉంది. మేరాజ్ యాత్ర ఏ ఉద్దేశ్యం మేరకు జరిగిందో, అల్లాహ్ తన ప్రవక్తను పిలిచి ఏమని హితోపదేశం చేశాడో... ఖుర్‌ఆన్ తెలుపగా, మేరాజ్ యాత్ర జరిగిన పూర్తి వైనాన్ని, యాత్ర మధ్యలో జరిగి సంఘటనలను హదీసులు తెలియజేశాయి.

ఈ సంఘటనకు సంబంధించి వివరాలు 28 మంది సమకాలీన ఉల్లేఖకుల ద్వారా మన దాకా చేరాయి. వీరిలో ఏడుగురు ఉల్లేఖకులు మేరాజ్ సంఘటన సమయంలో బ్రతికి ఉన్నారు. మిగిలిన 21 మంది ఉల్లేఖకులు మహాప్రవక్త (సల్లం) నోట ఈ సంఘటన గురించి విన్నారు. ఈ సంఘటనను పురస్కరించుకుని వచ్చిన ఉల్లేఖనాలు సంఘటనకు సంబంధించి వివిధ కోణాలపై వెలుగు ప్రసరింపజేస్తున్నాయి. ఈ ఉల్లేఖనాలన్నింటినీ కలిపితే ఆసక్తికరమైన, అర్థవంతమైన, హృదయాలను హత్తుకునే యాత్రాక్రమం రూపొందుతుంది. అత్యంత ఆసక్తికరమైన ఈ సంఘటనలాంటి మరో సంఘటన ఆనవాళ్లు ఇస్లామీయ సాహిత్య చరిత్రలో మరెక్కడా కనిపించవు.

అప్పటికి మహాప్రవక్త (సల్లం)కు దైవదౌత్యం లభించి పన్నెండేండ్లు గడిచిపోయాయి. అప్పుడు ఆయన (సల్లం) వయసు యాభై రెండేండ్లు. ఒకరోజు మహాప్రవక్త (సల్లం) కాబాగృహ ప్రాంగణంలో మగతనిద్రలో ఉన్నారు. అకస్మాత్తుగా హజ్రత్ జిబ్రయీల్ (అలై) వచ్చి మహాప్రవక్త (సల్లం)ను నిద్ర లేపి 'జమ్‌జమ్' బావి దగ్గరకు తీసుకుపోయారు. అక్కడ ఆయన హృదయాన్ని

చీల్చి గుండెకాయను జమ్‌జమ్ జలంతో శుభ్రపరిచారు. తరువాత దాన్ని విశ్వాసం, వివేచనలతో నింపి మూసివేశారు. ఆ తరువాత స్వారీ చేసేందుకు ఒక (విచిత్ర జంతు) వాహనాన్ని హాజరుపరచారు. అది తెల్లగా, కంచర గాడిద కంటే కాస్త చిన్నగా ఉంది. అది మెరుపు కంటే వేగంగా ప్రయాణిస్తుంది. అందువల్ల దానిని 'బుర్రాఖ్'గా వ్యవహరిస్తారు. గత ప్రవక్తలు కూడా తమ ప్రయాణ నిమిత్తం ఈ (వింత)జంతువునే వాహనంగా ఉపయోగించేవారు. మహాప్రవక్త (సల్లం) కుర్చునేటప్పుడు ఆ వాహనం (జంతువు) బెదిరిపోయింది. అది చూచి జిబ్రయీల్ (అలై) 'ముహమ్మద్ ప్రవక్త (సల్లం) లాంటి ఉత్తమ వ్యక్తిత్వం కంటే మించిన ఏ వ్యక్తీ ఇప్పటివరకూ నీపై ఎక్కలేదు' అని అన్నారు. తరువాత మహాప్రవక్త (సల్లం) దాన్నధిరోహించి దైవదూత జిబ్రయీల్ (అలై)తో పాటు బయలుదేరారు. మొదటి మజిలి మదీనా పట్టణము. అక్కడ ఆయన దిగి నమాజ్ చేశారు. అప్పుడు దైవదూత జిబ్రియీల్ (అలై) మహాప్రవక్త (స)ను ఉద్దేశిస్తూ 'మీరు ఇక్కడికే హిజ్రత్ చేసివస్తారు' అని అన్నారు. రెండవ మజిలి మూసాప్రవక్త (అలై)తో అల్లాహ్ సంభాషించిన సీనాయి కొండ. మూడవ స్టేజి ఈసా ప్రవక్త (అలై) జన్మస్థానమయిన బైతుల్లహమ్ (బెత్లెహేం). నాల్గవ స్టేజి బైతుల్ మఖ్‌దిస్ (జెరూసలేము మసీదు). దీంతో బుర్రాఖ్ ప్రయాణం ముగుస్తుంది.

మహాప్రవక్త (సల్లం) బుర్రాఖ్ పై పర్యటిస్తున్నప్పుడు దారిలో కొన్ని సంఘటనలు జరిగాయి. ఒకచోట ఎవరో ఒకతను దైవప్రవక్త (సల్లం)ను 'ఇటు వైపు రా!' అని పిలిచాడు. దైవప్రవక్త (సల్లం) అదేమీ పట్టించుకోలేదు. అప్పుడు దైవదూత జిబ్రయీల్ (అలై) "ఇతడు మిమ్మల్ని యూదమతం వైపుకు పిలుస్తున్నాడు." అని అన్నారు. అంతలోనే 'ఇటువైపు వచ్చేయి!' అని మరో దిశ నుండి పిలుపు వచ్చింది. దైవప్రవక్త (సల్లం) అతని వైపు కూడా చూడలేదు. అప్పుడు దైవదూత జిబ్రయీల్ (అలై) 'ఇతడు క్రైస్తవ మత ప్రచారకుడు' అని అన్నారు. అనంతరం అపురూప సౌందర్యవతి అయిన ఒక స్త్రీ దైవప్రవక్త (సల్లం) కంట పడింది. ఆయన్ను ఆమె తన వైపు పిలిచింది. దైవప్రవక్త (సల్లం) ఆమె వైపు నుండి కూడా చూపులు మరల్చుకున్నారు. అప్పుడు జిబ్రయీల్ (అలై) 'ఈమె ప్రపంచం' అని అన్నారు. తరువాత బాగా వయసు మీరిన ఒక ముసలమ్మ

మహాప్రవక్త (సల్లం)కు ఎదురైంది. అప్పుడు జిబ్రయీల్ 'ఈమెను చూచి ప్రపంచ వయస్సును అంచనా వేసుకోండి' అని అన్నారు. ఆ తరువాత మరో వ్యక్తి తారసపడ్డాడు. అతను కూడా దైవప్రవక్త (సల్లం)ను తనవైపు ఆకర్షించ డానికి ప్రయత్నించాడు. అయితే దైవప్రవక్త (సల్లం) అతడ్ని కూడా విస్మరించి ముందుకు సాగారు. అప్పుడు జిబ్రయీల్ (అలై) 'ఇతను షైతాన్ మిమ్మల్ని దారిమళ్ళించడానికి ప్రయత్నిస్తున్నాడు' అని అన్నారు.

బైతుల్ మఖ్దిస్ చేరిన తరువాత మహాప్రవక్త (సల్లం) 'బుర్రాఖ్' దిగి దాన్ని గతప్రవక్తలు కట్టినచోటే కట్టేశారు. ఆ తరువాత సులైమాన్ ప్రవక్త (అలై) నిర్మించిన హైకలె సులెమానిలో ప్రవేశించారు. అక్కడ ఆది నుండి అంతం వరకూ ఆవిర్భవించిన దైవప్రవక్తలంతా సమావేశమై ఉన్నారు. వారు మహా ప్రవక్త (స)ను చూడగానే నమాజ్ కోసం బారులు తీరి నిలబడ్డారు. ఇమామత్ (నాయకత్వం) ఎవరు వహిస్తారో అని అందరూ నిరీక్షించసాగారు. అప్పుడు దైవదూత జిబ్రయీల్ (అలై), మహాప్రవక్త ముహమ్మద్ (సల్లం)ను ఇమామత్ వహించ వల్సిందిగా కోరారు. మహాప్రవక్త (స) నేతృత్వంలో అందరూ నమాజ్ చేశారు. నమాజ్ ముగిసిన తరువాత మహాప్రవక్త (సల్లం) ముందు మూడు పాత్రలు వుంచబడ్డాయి. ఒక దానిలో నీళ్ళు, రెండవ దానిలో పాలు, మూడవ దానిలో మద్యం ఉన్నాయి. దైవప్రవక్త (సల్లం) ఆ మూడింటిలో నుండి పాలపాత్రను మాత్రమే స్వీకరించారు. అప్పుడు దైవదూత జిబ్రయీల్ (అలై) మీరు సహజధర్మాన్నే ఆశ్రయించారు అన్నారు.

తరువాత మహాప్రవక్త (సల్లం) దగ్గరకు ఒక నిచ్చెన తీసుకు రాబడింది. దైవదూత జిబ్రయీల్ (అలైహి) ఆ నిచ్చెన ద్వారా మహాప్రవక్త (స)ను గగనానికి తీసికెళ్ళారు. అరబీ భాషలో 'నిచ్చెన'ను 'మేరాజ్' అంటారు. మేరాజ్ అంటే 'అధిరోహించడం' అని అర్థం. అందువల్ల ఈ సంఘటన 'మేరాజ్ సంఘ టన'గా పేరుగాంచింది.

మహాప్రవక్త (సల్లం) మొదటి ఆకాశానికి చేరుకున్నారు. అప్పుడా ఆకాశ ద్వారము మూసివుంది. ద్వారపాలకులు హజ్రత్ జిబ్రయీల్ (అలై)ని ఉద్దేశించి "మీతోపాటు వచ్చిన ఈ వ్యక్తి ఎవరూ?"అని అడిగారు. దానికి ఆయన

'మహమ్మద్ (స)' అని బదులిచ్చారు. "ఈయన్ని పిలిపించడం జరిగిందా?" అని అడిగారు ద్వారపాలకులు మళ్ళీ. "అవును" అన్నారు జిబ్రయీల్ (అలై). అప్పుడు ఆకాశ ద్వారాలు తెరవబడ్డాయి. మొదటి ఆకాశంలోని దైవదూతలు మహాప్రవక్త (సల్లం)ను సాదరంగా ఆహ్వానిస్తూ ఘనంగా స్వాగతం పలికారు. అక్కడ ఆయన (సల్లం)కు, ఉన్నత హోదా అంతస్తులు కలిగిన అనేక మంది వ్యక్తులతో పరిచయమయింది. వారు సంపూర్ణ మానవరూపం, దేదీప్యమానమైన ముఖవర్ఛస్సు కలిగి ఉన్నారు. వారిలో ఒకరిని పరిచయం చేయిస్తూ జిబ్రయీల్ (అలై) "ఈయన హజ్రత్ ఆదమ్, మానవజాతికి మూల పురుషుడు" అని అన్నారు. హజ్రత్ ఆదం (అలై)కు ఇరువైపులా కొందరు గుమిగూడి ఉన్నారు. ఆయన (అలై) తన కుడి వైపు చూసి ఆనందించడం, ఎడమవైపు చూసి దుఃఖించడం చూసిన దైవప్రవక్త (సల్లం) 'ఇదేమిటీ?' అని అడిగారు. దానికి హజ్రత్ జిబ్రయీల్ (అలై) "ఆదం (అలై)కు కుడి ఎడమల వైపు ఆయన సంతానం ఉంది. ఆదమ్ తన కుడివైపు పుణ్యాత్ములైన సంతానాన్ని చూసి సంతోషిస్తారు; ఎడమవైపు పాపాత్ములైన సంతానాన్ని చూసి దుఃఖిస్తుంటారు" అని బదులిచ్చారు జిబ్రయీల్.

మొదటి ఆకాశంలో మహాప్రవక్త (సల్లం)కు అన్ని విషయాలు క్షుణ్ణంగా చూసే అవకాశం లభించింది. ఆయన అక్కడ ఒకచోట కొందరు వ్యక్తులు పంట కోయడాన్ని చూశారు. అయితే ఆ పంట కోస్తున్న కొద్ది తరగడానికి బదులు పెరగడం చూసి ఆయన ఆశ్చర్యపోతూ 'ఈ వ్యవహారమేమిటీ' అని అడిగారు. హజ్రత్ జిబ్రయీల్ (అలై) "వీరు దైవమార్గంలో జిహాద్ చేసినవారు" అని సమాధానమిచ్చారు.

మరొకచోట దైవప్రవక్త (సల్లం) కొందరి తలలను బండరాళ్ళతో చితక కొడ్తూ ఉండటం చూసి 'ఈ వ్యవహారమేమిటీ' అని అడిగారు. దానికి హజ్రత్ జిబ్రయీల్ (అలై) "'వీరు నిద్రమత్తుతో నమాజ్ చేయడానికి లేచేవారు కాదు' అని చెప్పారు.

మరోచోట మహాప్రవక్త (సల్లం) కొందరు వ్యక్తులు అతుకుల దుస్తులు ధరించి పశువుల మాదిరిగా గడ్డి మేస్తుండటం చూసి 'వీరెవర'ని' అడిగారు. హజ్రత్ జిబ్రయీల్ (అలై) 'వీరు తమ సంపదల నుండి జకాత్ చెల్లించనివారు' అని సమాధానమిచ్చారు.

ఇంకోచోట ఒకవ్యక్తి కట్టెలు ప్రోగుచేసి మోపుకట్టి దాన్ని లేపేందుకు ప్రయత్నించి విఫలమౌతున్నాడు. అయితే ఆ మోపులో నుంచి కొన్ని కట్టెలు తీసెయ్యడానికి బదులు మరికొన్ని కట్టెలు కలిపి మోపు కడుతున్నాడు. దైవప్రవక్త (సల్లం) అతని ప్రవర్తన చూసి 'ఈ మూర్ఖుడెవడు?' అని దైవదూతను అడిగారు. అందుకు జిబ్రయీల్ (అలై) "ఈ వ్యక్తి మోయలేనన్ని బాధ్యతలు మీద వేసుకునేవాడు. వాటిని తగ్గించుకునే బదులు ఇంకాస్తా పెంచుకుంటూ పోయేవాడు' అని సమాధానమిచ్చారు.

మరొకచోట మహాప్రవక్త (సల్లం) కొందరు వ్యక్తులను చూశారు. వారి నాలుకలు, పెదవులు కత్తెర్లతో కత్తిరించబడుతున్నాయి. ఆయన 'ఇదేమిటి' అని అడగ్గా 'వీరు బాధ్యత మరచిన ఉపన్యాసకులు; విశృంఖల ప్రసంగాలు చేస్తూ కలహాలు, కల్లోలాలు సృష్టిస్తుండేవారు' అని చెప్పారు జిబ్రయీల్ (అలై).

వేరొకచోట ఒక చట్టుబండలో కొంచెం పగులు ఏర్పడింది. అందులో నుంచి బాగా బలసిన ఓ ఎద్దు బయటికి వచ్చింది. తిరిగి అది ఆ పగులులో దూరడానికి ప్రయత్నించింది. కాని ఎంత ప్రయత్నించినా ఆ సందులో దూర లేకపోయింది. మహాప్రవక్త (సల్లం) ఈ దృశ్యం చూసి 'ఇదేమిటీ?' అన్నారు. దానికి హజ్రత్ జిబ్రయీల్ (అలై) "ఇది బాధ్యతారాహిత్యంగా కల్లోలం రేకెత్తించే ఓమాట మాట్లాడి ఆతర్వాత పశ్చాత్తాం చెందే మనిషికి సంబంధించిన దృశ్యం. అతనలా పశ్చాత్తాపం చెంది తన మాటను సరిదిద్దుకోవటానికి ప్రయత్నిస్తాడు కాని, సరిదిద్దుకోలేకపోతాడు' అని సమాధానమిచ్చారు.

ఇంకొక చోట కొందరు మనుషులు స్వయంగా తమ శరీరాల నుండే మాంసం కోసి తింటున్నారు. దైవప్రవక్త (సల్లం) వాళ్ళను చూసి 'వీళ్ళెవరు?' అని అడిగారు. దానికి హజ్రత్ జిబ్రయీల్ (అలై) 'వీరు ఇతరులను ఎకసక్కెం చేసేవారు' అని అన్నారు.

వారికి సమీపంలోనే రాగిగోళ్ళుగల కొందరుమనుషులు ఉన్నారు. వారు తమ రాగిగోళ్ళతో తమ ముఖాలను, రొమ్ములను రక్కుకుంటున్నారు. మహాప్రవక్త (సల్లం) వారిని చూసి వీళ్ళెవరని అడిగారు. దానికి హజ్రత్ జిబ్రయీల్ (అలై) "వీరు ఇతరుల్ని గురించి పరోక్షంగా నిందిస్తూ వారిని అవమానించేవారు" అని అన్నారు.

ఒంటెల్లాంటి పెదాలను కలిగిఉండి అగ్నిని ఆరగించే కొందరిని చూసి దైవప్రవక్త (స), "వీరెవరూ!" అని అడగగా, "వీరు అనాథల సొమ్మును కాజేసే వారు" అని బదులిచ్చారు జిబ్రయీల్ (అలై).

దైవప్రవక్త (సల్లం)కు మరికొందరు వ్యక్తులు కనిపించారు. వారి కడుపులు బానకడుపులుగా ఉండి పాములతో నిండి ఉన్నాయి. దారిలో వచ్చే పోయేవారు వారిని త్రొక్కుతూ వెళ్ళేవారు. కాని వారు మాత్రం తమ స్థానాల నుండి కదలేవారు కాదు. దైవప్రవక్త (సల్లం) 'వీళ్ళెవరు' అనడిగారు. దానికి హజ్రత్ జిబ్రయీల్ (అలై) 'వీరు వడ్డీ తినేవారు' అని సమాధానమిచ్చారు.

మహాప్రవక్త (సల్లం) వేరొకచోట మరికొందరిని చూశారు. వారి ఒకవైపు తాజా మాంసం, మరోవైపు కుళ్ళిపోయి కంపుగొట్టే మాంసం ఉంది. వారు తాజా మాంసం తినేబదులు కుళ్ళిపోయిన మాంసం తింటున్నారు. మహాప్రవక్త (సల్లం) ఈ వింతను చూసి 'వీరెవరు?' అని ప్రశ్నించారు. దానికి దైవదూత జిబ్రయీల్ (అలై) 'వీరు (స్త్రీ-పురుషులు) ధర్మసమ్మతమైన స్త్రీ-పురుషులను కాదని అధర్మంగా (అక్రమ సంబంధాలు పెట్టుకొని) తమ మనోవాంఛల్ని తీర్చుకునేవారు" అని సమాధానమిచ్చారు.

వేరొకచోట కొందరు స్త్రీలు తమ వక్షోజాల ఆధారంగా వ్రేలాడుతున్నారు. అది చూసి మహాప్రవక్త (సల్లం) 'వీరెవరు?" అని అడిగారు. దానికి దైవదూత జిబ్రయీల్ (అలై) "ఈ స్త్రీలు తమదికాని సంతానాన్ని (అక్రమ సంతానాన్ని) తమ భర్తలకు అంటకట్టినవారు' అని అన్నారు.

ఈ పర్యటనలో దైవప్రవక్త (సల్లం)కు చిట్లిన ముఖంతో దురుసుగా ప్రవర్తించే ఒక దైవదూత పరిచయమయ్యాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "ఇప్పటి వరకు నన్ను కలిసిన దైవదూతలందరూ చిరునవ్వుతో, సాదరంగా కలిశారు. కాని ఇతను ఈ విధంగా ముఖం చిట్లించుకొని కలవడానికి కారణం ఏమిటి?" అని అడిగారు. దానికి జిబ్రయీల్ (అలై) "ఈయనకు సంతోషంతో పనేమిటీ, ఈయన నరక పాలకుడు" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఈ మాట విని నరకం ఎలా ఉంటుందో చూడాలని ఉంది అని తన కోరికను వ్యక్తపరిచారు. అప్పుడు నరకపాలకుడు హఠాత్తుగా ఆయన ముందున్న తెరను తొలగించగానే నరకం భీకర స్వరూపంతో కంటపడింది.

ఈవిధంగా దైవప్రవక్త (సల్లం) మొదటి ఆకాశం పర్యటన పూర్తి చేసి రెండవ ఆకాశంలోకి ప్రవేశించారు. ఆయనకు ఇక్కడ పరిచయమైన ప్రముఖ వ్యక్తులలో ఇద్దరు యువకులు చెప్పుకోతగినవారు. వారు హజ్రత్ యాహ్యా (అలై), హజ్రత్ ఈసా(అలై)' అని జిబ్రయీల్ (అలై) తెలియజేశారు.

మూడవ ఆకాశంలో తారల నడుమ పున్నమి చంద్రుడిలా అసామాన్య సౌందర్యవతుడైన ఒక యువకుడు పరిచయమయ్యాడు. ఆయన యూసుఫ్ ప్రవక్త (అలై) అని హజ్రత్ జిబ్రయీల్ (అలై) తెలియజేశారు.

మహాప్రవక్త ముహమ్మద్ (సల్లం) నాలుగవ ఆకాశంలో ఇద్రీస్ ప్రవక్త (అలై)ను, అయిదవ ఆకాశంలో హారూన్ ప్రవక్త (అలై)ను, ఆరవ ఆకాశంలో మూసా ప్రవక్త (అలై)ను కలిశారు. ఏడవ ఆకాశంలో మహా అద్భుతమైన ఒక భవనం కన్పించింది. దాని పేరు బైతుల్ మామూర్. అక్కడకు అసంఖ్యాకమైన దైవదూతలు వస్తూ పోతుంటారు. ఆ భవనం దగ్గర మహాప్రవక్త (సల్లం)కు తనను పోలిన ఒక మహనీయుడితో పరిచయమయింది. ఆయన ప్రముఖ దైవప్రవక్త హజ్రత్ ఇబ్రాహీం (అలై) అని తెలిసింది.

మహాప్రవక్త (సల్లం) ఇలా పైపైకి వెడుతూ చివరికి 'సిద్రతుల్ మున్తహా' అనే ఓ చోటికి చేరుకున్నారు. ఈ స్థలం విశ్వ ప్రభువు కొలువుకు, సృష్టిరాసులకు మధ్య ఒక సరిహద్దు లాంటిది. క్రింది నుండి పైకి వచ్చేవారు ఇక్కడదాకా వచ్చి ఆగిపోతారు. పైనుండి దైవాజ్ఞలు, దైవ శాసనాలు నేరుగా ఇక్కడికి వస్తాయి. ఈ స్థలం సమీపంలోనే దైవప్రవక్త (సల్లం)కు స్వర్గం చూపించడం జరిగింది. దేవుడు తన పుణ్యదాసుల కోసం స్వర్గంలో ఏ ఒక్కరూ కనీ, వినీ ఎరగని, చివరికి ఆలోచనకు సైతం తట్టని అసాధారణమైన మహా భాగ్యాలు ఏర్పాటుచేసి ఉంచాడు. ఏ కన్నూ చూడని, ఏ చెవీ వినని, ఏ బుద్ధీ ఆలోచించని, ఏ మేధస్సుకు అందని వస్తువులు ఉన్నాయి అక్కడ.

దైవదూత జిబ్రయీల్ (అలై) 'సిద్రతుల్ మున్తహా' వరకు వచ్చి ఆగి పోయారు. అక్కడి నుండి మహాప్రవక్త (సల్లం) ఒంటరిగా ముందుకు సాగారు. చివరికి ఆయన ఒక ఎత్తయిన, చదునైన ప్రదేశంలోకి ప్రవేశించగానే విశ్వ సామ్రాట్టు కొలువు దర్శనమయింది. విశ్వప్రభువుతో సంభాషించే మహా భాగ్యం కూడా లభించింది. విశ్వసామ్రాట్టు జారీ చేసిన ఉత్తర్వులలో కొన్ని

ముఖ్యమైనవి ఇవి:

1. ప్రతి రోజూ యాభై సార్లు విధిగా నమాజ్ చేయాలి.
2. బఖరా సూరాలోని చివరి రెండు ఆయత్‌లు బోధించబడ్డాయి.
3. షిర్క్ (బహుదైవారాధన) తప్ప ఇతర పాపాలన్నీ క్షమించబడే అవకాశం ఉందని తెలియజేయబడింది.
4. ఒక మనిషి ఒక సత్కార్యం చేయ సంకల్పించుకుంటే అతని కర్మ పత్రంలో ఒక పుణ్యం రాయబడుతుంది. అతనా సత్కా ర్యాన్ని ఆచరణలో పెడితే అతని కర్మపత్రంలో పది పుణ్యాలు రాయబడ తాయి. అయితే ఒక మనిషి ఒక దుష్కార్యం చేయదలచు కున్నప్పుడు అతని కర్మపత్రంలో ఏదీ రాయడం జరగదు. ఒకవేళ అతనా దుష్కా ర్యాన్ని ఆచరణలో పెడితే అతని కర్మపత్రంలో ఒకే ఒక దుష్కార్యం (పాపం) రాయబడుతుంది.

మహాప్రవక్త ముహమ్మద్ (సల్లం) దైవసన్నిధి నుండి తిరుగు ప్రయాణ మయ్యేటప్పుడు మూసా ప్రవక్త (అలై)ను కలిశారు. హ్రజత్ మూసా (అలై) మహా ప్రవక్త (సల్లం)కు ఇవ్వబడిన దైవాజ్ఞలు విని "నాకు ఇస్రాయీల్ సంతతి ప్రజల నుండి చేదు అనుభవాలు ఎదురయ్యాయి. మీ అనుచర సమాజం రోజుకు యాభై సార్లు నమాజ్ నిర్వహించజాలదని నేను భావిస్తున్నాను. కాబట్టి మీరు వెనక్కి వెళ్ళిపోయి నమాజుల సంఖ్య తగ్గించమని విన్నవించుకోండి" అని అన్నారు. అప్పుడు మహాప్రవక్త (సల్లం) దైవసన్నిధికి వెళ్ళి నమాజుల తగ్గింపు కోసం విశ్వప్రభువును విన్నవించుకున్నారు. దాంతో పది నమాజ్‌లు తగ్గించ బడ్డాయి. కాని మూసా ప్రవక్త (అలై), మీ అనుచర సమాజం అన్ని సార్లు కూడా నమాజ్ చేయజాలదని చెబుతూ ఆయన్ని మళ్ళీ వెనక్కి పంపారు. ఇలా హ్రజత్ మూసా (అలై) చెప్పడంతో మహాప్రవక్త (సల్లం) మాటిమాటికి దైవ సన్నిధికి వెళ్ళి నమాజుల తగ్గింపు కోసం అర్థించేవారు. ప్రతి పర్యాయము పది నమాజులు తగ్గించబడేవి. చివరికి ఐదు నమాజ్‌లు విధిగా నిర్ణయించబడింది. ఈ ఐదు పూటల నమాజు యాభై పూటల నమాజ్‌కు సమానమని చెప్ప బడింది.

తిరుగు ప్రయాణంలో మహాప్రవక్త (స) నిచ్చెన ద్వారానే దిగి బైతుల్ మఖ్‌దిస్‌కు చేరుకున్నారు. అక్కడ దైవప్రవక్తలంతా హాజరైఉన్నారు. మహాప్రవక్త

(సల్లం) నేతృత్వంలో అందరూ నమాజ్ చేశారు. బహుశా అది ఫజ్ర్ నమాజ్ వేళ అయిఉండవచ్చు. అనంతరం మహాప్రవక్త (సల్లం) 'బుర్రాఖ్' ఎక్కి మక్కా తిరిగొచ్చారు.

ఉదయాన మహాప్రవక్త (సల్లం) అందరికంటే ముందు తన సోదరి ఉమ్మెహానీకి ఈ సంఘటన గురించి చెప్పారు. దైవప్రవక్త (సల్లం) ఇంటినుండి బయటికి వెళ్తున్నప్పుడు ఆమె ఆయన చొక్కా పట్టుకొని 'ఈ సంఘటనను గురించి ఎవరికీ చెప్పకు. చెబితే నిన్ను అపహాస్యం చేసేందుకు నీ విరోధులకు మరొక సాకు దొరుకుతుంది' అని అన్నారు. కాని దైవప్రవక్త (స) 'ఈ విషయం అందరికీ చెప్తాను' అని బయటికి వెళ్ళిపోయారు. కాబాగృహంలో ప్రవేశించగానే అక్కడ అబూజహల్ ఎదురయ్యాడు. "ఈరోజు మరేదైనా కొత్త విషయం ఉందా!" అని అడిగాడతను పరిహాసంగా. దైవప్రవక్త (సల్లం) ఏమాత్రం సంకోచించకుండా "ఆ...నేను రాత్రి బైతుల్ మఖ్దిస్‌కి వెళ్ళివచ్చాను" అని అన్నారు. అబూజహల్ ఈమాట విని "ఏమిటి? నీవు రాత్రికి రాత్రే బైతుల్ మఖ్దిస్‌కు వెళ్ళి మళ్ళీ తిరిగొచ్చావా?" అని ఆశ్చర్యపోతూ అడిగాడు. మహాప్రవక్త (స) అవునన్నారు. అప్పుడు అబూజహల్ "అయితే నేను జనాన్ని పిలుస్తాను, వారి ముందు కూడా ఈ మాటే అంటావా?' అని అడిగాడు. అందుకు దైవప్రవక్త (సల్లం) 'తప్పకుండా' అని జవాబిచ్చారు. అబూజహల్ వెంటనే కేకలు వేసి జనాన్ని పోగు చేశాడు. ఓ పెద్ద జనసమూహం ఏర్పడగానే "ఇప్పుడు చెప్పు నీవు చెప్పదలచుకున్న ఆ విషయం" అని అన్నాడు. దైవప్రవక్త (సల్లం) తాను బైతుల్ మఖ్దిస్‌కు పోయివచ్చిన సంఘటన గురించి చెప్పేశారు. అది వినగానే ప్రజలు అపహాస్యం చేయడం ప్రారంభించారు. 'రెండు నెలల ప్రయాణం ఒకే ఒక రాత్రిలో సాధ్యమయ్యే పనేనా? అసంభవం.....ఇది పచ్చి అబద్ధం. ఇంతకు ముందే మేము నీకు మతి స్థిమితంగా లేదేమోనని అనుమా నించేవాళ్ళం. మా అనుమానం ఇప్పుడు నిజమని తేలింది" అని హేళన చేయ సాగారు ప్రజలు.

ఈ వార్త మక్కాలో కార్చిచ్చులా వ్యాపించింది. సంఘటన గురించి విన్న ముస్లింలలో కొందరు ఇస్లాం నుండి వెనుదిరిగారు. ఖురైష్ నాయకుల్లో కొందరు హజ్రత్ అబూబక్ర్ (రజి) వద్దకు వెళ్ళారు. అతను ముహమ్మద్ (స)కు కుడిభుజం లాంటివాడు గనక, అతను (ఇస్లాం నుండి) వెనుదిరిగితే ఇస్లాం నిర్జీవమైపోతుందని వారు తలచారు. అయితే హజ్రత్ అబూబక్ర్ (రజి) మేరాజ్

ఉదంతం సంగతి విని "ఇందులో ఆశ్చర్యమేముంది. ఆయన (స) వద్దకు దైవ సందేశం ఆకాశం నుండి నేరుగా వస్తుందన్న విషయాన్ని నేను ఎప్పటి నుంచో నమ్ముతున్నాను" అని అన్నారు.

ఆ తరువాత హజ్రత్ అబూబక్ర్ (రజి) కాబా గృహానికి వెళ్ళి అక్కడ దైవప్రవక్త (సల్లం)ను కలిశారు. ఇంతకు ముందు హేళన చేసిన వారందరూ అక్కడ గుమిగూడారు. అప్పుడు హజ్రత్ అబూబక్ర్ (రజి) "మీరు నిజంగానే ఇలా అన్నారా?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) అవును" అని అన్నారు. హజ్రత్ అబూబక్ర్ (రజి) ఈమాట విని "అయితే దైవప్రవక్తా! నేను బైతుల్ మఖ్దిస్ చూసి ఉన్నాను. దాని వివరాలు చెప్పండి" అని అన్నారు. మహాప్రవక్త (స) బైతుల్ మఖ్దిస్ ఆకారం, దాని రూపురేఖల్ని గురించి ఒక్కొక్క విషయం వివరంగా చెప్పడం మొదలెట్టారు. ఆ వర్ణనలు వింటున్న సభికు లందరూ బైతుల్‌మఖ్దిస్ తమ కళ్ళ ముందు ప్రత్యక్షమయినట్లు అనుభూతి చెంద సాగారు. హజ్రత్ అబూబక్ర్ (రజి) చేసిన ఈ ఉపాయం వల్ల సత్య తిరస్కారు లకు ఎదురుదెబ్బ తగిలింది. సభికులలో వ్యాపార నిమిత్తం ఎన్నో సార్లు బైతుల్ మఖ్దిస్‌కి వెళ్ళి వచ్చిన వారు కూడా ఉన్నారు. వారందరి హృదయాలు దైవప్రవక్త (సల్లం) మాటలను అంగీకరించాయి. సభికులలో కొందరు మరి కొన్ని సాక్ష్యాలు చెప్పమని పట్టుబట్టారు. అప్పుడు దైవప్రవక్త (స) "నేను ప్రయాణం చేస్తూ ఫలానా వర్తక బృందం మీదుగా వెళ్ళాను, వారి వద్ద ఫలానా వస్తువులు ఉన్నాయి. దారిలో వర్తకుల ఒంటెలు బుర్రాఖ్‌ని చూసి బెదిరి పోయాయి. వాటిలో ఒక ఒంటె బాగా బెదరిపోయి ఫలానా లోయ వైపు పరు గెత్తింది. ఆ ఒంటె ఎటువైపు వెళ్ళింది నేనా వర్తకులకు తెలియ జేశాను. తిరుగు ప్రయాణంలో ఫలానా వర్తక బృందంవారు ఫలానా ప్రాంతం వద్ద నన్ను కలిశారు. అందరూ నిద్రిస్తున్న సమయంలో నేను వారి పాత్రలో నుంచి నీళ్ళు త్రాగాను. నీళ్ళు తాగినట్లు సాక్ష్యం కూడా వదలిపెట్టాను'అన్నారు. ఇలా మరెన్నో సంఘటనల గురించి మహాప్రవక్త (స) వివరించారు. ఆ తరు వాత బైతుల్ మఖ్దిస్ నుండి మక్కాకు తిరిగొచ్చిన వర్తక బృందాలన్నీ ఈ సంఘటనలను ధృవీకరించాయి. హజ్రత్ అబూబక్ర్ (రజి) చేసిన ఉపాయం వల్ల విరోధుల నోళ్ళకు తాళాలు పడిపోయాయి. కాని ఇది నిజమైన సంఘట నేనా, సాధ్య మయ్యే విషయమేనా అన్న సందేహం కొందరి మెద ళ్ళను ఇంకా తొలచి వేస్తూనే ఉంది. (30-7-1943)

అపార కృపాశీలుడు పరమ కరుణామయుడు అల్లాహ్ పేరుతో

# మేరాజ్ సందేశం

ఇస్లామీయ చరిత్రలో రెండు రాత్రులకు గొప్ప ప్రాముఖ్యం ఉంది. ఒకటి, మానవ మహోపకారి ముహమ్మద్ (సల్లం)పై దివ్యఖుర్ఆన్ అవతరణ ప్రారంభమైన రాత్రి రెండోది ఆ మహనీయుడు (సల్లం) మేరాజ్ భాగ్యానికి నోచుకున్న రాత్రి. మొదటి రాత్రి ప్రాముఖ్యం సాధారణంగా అందరికీ తెలిసిందే. సమస్త మానవాళి మార్గదర్శనం కోసం స్పష్టమైన ఆదేశాలు, హితవులతో ఖుర్ఆన్ అవతరించిన రాత్రి అది. శతాబ్దాలుగా, అసత్యం, అజ్ఞానాల అంధకారంలో ఇది సత్యం, విజ్ఞానాల వెలుగులు విరజిమ్ముతూ వస్తోంది. ప్రళయం వరకూ ఈ పరంపర కొనసాగుతూనే ఉంటుంది. అయితే రెండవ రాత్రి ప్రాముఖ్యం మాత్రం కొన్ని ధార్మిక వాదనల్లో మరుగున పడిపోయింది. ఈ రాత్రి మానవాళి సంక్షేమం కోసం ఎలాంటి అపూర్వ సిద్ధాంత నిర్మాణం జరిగిందో చాలా కొద్దిమందికి మాత్రమే తెలుసు. అందుకని శుభప్రదమైన ఈరాత్రి మనకోసం ఇచ్చిన సందేశాన్ని వివరంగా తెలుసుకుందాం.

విశ్వసనీయ ఉల్లేఖనాల ప్రకారం హిజ్రత్‌కు ఒక సంవత్సరం ముందు ఈ సంఘటన సంభవించింది. అప్పటికి దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం) ఏకేశ్వరాధనా సందేశ ప్రచారం ప్రారంభించి పన్నెండేళ్ళు గడిచాయి. సత్య వ్యతిరేక వర్గం ఆయన ప్రచారమార్గంలో ఎన్ని అవరోధాలు సృష్టించినప్పటికీ ఆ మహనీయుని పిలుపు అరేబియాలోని మూల మూలనా ప్రతిధ్వనించ సాగింది. చివరికి అరేబియాలోని ఏ ఒక్క తెగా దైవప్రవక్తకు అనుచరుల్లేని

తెగగా మిగల్లేదు. స్వయంగా మక్కా నగరంలో కూడా అత్యంత విశ్వసనీయు లైన కార్యకర్తల ఓ చిన్న సమూహం నిత్యం దైవప్రవక్త వెన్నంటి ఉండేది.

అంతటి విశ్వసనీయులు, ఉత్సాహవంతులైన కార్యకర్తలు ప్రపంచం లోని ఏ ఉద్యమానికీ లభ్యం కాలేదంటే అతిశయోక్తి కాదు. మదీనాలో కూడా బలమైన రెండు తెగల్లో అధికసంఖ్యాకులు దైవప్రవక్తను విశ్వసించారు. మహాప్రవక్త (సల్లం) మక్కా నుండి మదీనాకు వలస వెళ్ళే సమయం, దీనితోపాటు దేశంలో ఎక్కడెక్కడో, విభిన్న ప్రాంతాల్లో నివసిస్తున్న ముస్లిం లందర్నీ సమీకరించి, ఇప్పటి వరకూ తాము ప్రచారం చేస్తున్న సూత్రాలు, విధానాల ప్రాతిపదికన ఓ రాజ్యాన్ని ఏర్పాటు చేసే తరుణం ఆసన్నమైంది. ఆ సందర్భంలోనే దైవప్రవక్త (సల్లం)ను మేరాజ్ యాత్రకు పిలిపించడం జరిగింది.

ఈ యాత్ర నుండి తిరిగొచ్చిన తరువాత దైవప్రవక్త (సల్లం) అందజేసిన సందేశం ఖుర్‌ఆన్‌లోని 17వ అధ్యాయం 'బనీ ఇస్రాయీల్'లో ప్రతి అక్షరం ఈనాటికీ సురక్షితంగా ఉంది. ఈ అధ్యాయాన్ని అధ్యయనం చేస్తూ దీని చారిత్రక నేపథ్యాన్ని దృష్టిలో ఉంచుకుంటే ఇస్లామీయ శాసనాలు, సూత్రాల ప్రాతిపదికన ఓ నూతన రాజ్యానికి రూపకల్పన చేసే ముందు దైవప్రవక్త , ఆయన అనుయాయులు ముున్ముందు చేయవలసిన కార్యాలను గురించి హితోపదేశాలు చేయబడుతున్నాయని మనకు స్పష్టంగా అర్థమైపోతుంది.

ఈ సందేశంలో మేరాజ్ యాత్రను ప్రస్తావించిన తర్వాత మొట్ట మొదట ఇస్రాయీలీయుల చరిత్రతో మనకు పాఠం చెప్పడం జరిగింది. ఈజిప్టువారి బానిసత్వం నుండి బయటపడి వారు స్వేచ్ఛా జీవనం గడుపు తున్నప్పుడు దేవుడు వారి కోసం దివ్యగ్రంథం పంపి, 'ప్రతి వ్యవహారంలోనూ మీరు నన్ను తప్ప మరెవరినీ ఆశ్రయించ వద్ద'ని తాకీదు చేశాడు. కాని, ఇస్రాయీలీయులు ఈ దైవానుగ్రహానికి కృతజ్ఞతలు చెల్లించే బదులు తిరస్కారవైఖరి అవలం బించారు. భువిలో సంస్కర్తలుగా రూపొందే బదులు విద్రోహులుగా, కల్లోల జనకులుగా తయారయ్యారు. అంచేత దేవుడు వారిని

ఒకసారి బాబిలోనియా వారి చేత పీచమణచివేస్తే, మరోసారి రోమన్లను వారిపై రుద్దాడు. ఈ గుణ పాఠాన్ని ముస్లింలకు సాక్ష్యంగా చూపిస్తూ ఖుర్‌ఆన్ మాత్రమే మీకు చక్కని రుజుమార్గం చూపిస్తుందని, దాని హితోపదేశాల వెలుగులో నడిస్తేనే మీపై గొప్ప వరాలు, శుభాలు అవతరిస్తాయని, దాన్ని విస్మరిస్తే ఇస్రాయీలీయు లకు పట్టిన గతే మీకూ పడుతుందని దేవుడు వారిని హెచ్చరించాడు.

రెండో విషయం, ప్రతి మనిషి స్వతహాగా ఓ సుస్థిర వ్యక్తిత్వాన్ని కలిగి దానికి బాధ్యుడుగా ఉంటాడు. స్వయంగా అతడి ఆచరణలే అతడేమిటో నిరూపిస్తాయి. సన్మార్గంలో నడిస్తే మేలు జరిగేది అతనికే, అపమార్గంలో నడిస్తే నష్టపొయ్యేదీ అతడే. ఈ వ్యక్తిగత బాధ్యతలో ఎవరికీ ఎలాంటి భాగం లేదు. ఎవరి భారం వారిదే, ఒకరి భారం మరొకరు మోసే సమస్యే లేదు. కనుక ఓ సత్సమాజంలోని ప్రతి వ్యక్తీ తన వ్యక్తిగత బాధ్యతల పట్ల జాగరూకుడై ఉండాలి. ఇతరులు ఏం చేస్తున్నారని చూసే ముందు తానేం చేస్తున్నాడో ఆత్మపరిశీలన చేసుకోవాల్సిన అవసరముంది.

మూడవ విషయం, ఒక సమాజం పతనావస్థకు చేరుకున్నదంటే దానికి మూలకారణం ఆ సమాజపెద్దలు పెడమార్గం పట్టడమే. సంపన్నులు, పాలకులు పెడమార్గం పట్టి అన్యాయాలు-అక్రమాలకు, దౌర్జన్యాలకు పాల్పడుతున్నప్పుడు ఆ జాతి పతనదశ ప్రారంభమవుతుంది. ఈ ఉపద్రవం జాతి మొత్తాన్నీ ముంచెత్తుతుంది. కాబట్టి సమాజం తనంతట తాను నాశనం కాకుండా ఉండాలంటే, అది రాజకీయాధికార పగ్గాలు, ఆర్థిక వ్యవస్థ తాళాలు అవినీతి పరులు, దౌర్జన్యపరుల చేతికి పోకుండా జాగ్రత్త పడాలి.

ఖుర్‌ఆన్‌లో మాటిమాటికీ చెప్పబడుతున్న 'ప్రాపంచిక లాభాలు, సుఖ భోగాలే మీ దృష్టిలో ఉంటే అవి మీకు లభించే అవకాశముంది. కాని వీటి అంతిమ పరిణామం మాత్రం అత్యంత భయానకంగా ఉంటుందని' గుర్తు చేయబడింది. ఇహం-పరం ఉభయ లోకాల్లోనూ శాశ్వత సాఫల్యం కావాలంటే

పరచింత, పరలోకపు జవాబుదారీ భావన మీరు చేసే ప్రతి పనిలో ప్రతిబింబ జేయడానికి ప్రయత్నించాలి. ఈ ప్రపంచమే సర్వస్వమని భావించేవాళ్ళ సౌఖ్యాలు పైకి మనోహరంగా, నిర్మాణాత్మకమైనవిగా కనబడతాయి. కాని ఈ నిర్మాణంలోనే చెడు శాశ్వత భాగమై ఉన్నందున, పరలోకపు జవాబుదారీ భావనలో వ్యక్తమయ్యే నైతికవిలువలు వీరిలో మచ్చుకైనా కానరావు. ఈ తేడా ఇలాంటి భావాలు కలిగిన ఇద్దరు వ్యక్తుల్లో ఈ లోకంలోనే గమనించవచ్చు. ఈ తేడాయే ముమ్మందు జీవితంలో ప్రస్ఫుటంగా వ్యక్తమై ఒకరి జీవితం పూర్తి వైఫల్యాలతో, మరొకరి జీవితం పూర్తి సాఫల్యాలతో నిండిపోతుంది.

ఈ హితవుల తర్వాత ఏ సూత్రాల ప్రాతిపదికన ఇస్లామీయ రాజ్య స్థాపన, సత్సమాజ నిర్మాణం జరిగిందో, ఆ మహోన్నత సూత్రాలు వివరించ బడ్డాయి. ఈ పద్నాలుగు మౌలిక సూత్రాలను యధాతథంగా అంటే, మేరాజ్ సందేశంలో వివరించబడిన విధంగానే మీ ముందుంచుతున్నాము.

1. ఏకేశ్వరుడైన 'సృష్టికర్త' తప్ప మరెవరినీ ఆరాధ్యశక్తిగా భావించ కూడదు. ఆయనే మీ ఏకైక ఆరాధ్యుడు. మీరు ఆయన దాస్యాన్నే చేయండి. ఆయనకే విధేయులై ఉండండి. ఆయన ఆదేశాలనే పాటించండి. ఆయన పాలనాధికారంలో మరెవరినీ చేర్చకండి. ఆయన వదలి మరెవరినైనా పాలకుడి గా, పోషకుడిగా భావిస్తే మీరు నాశనమవుతారు. ఏకైక దైవాన్ని విధేయిం చడం మూలంగా లభించే సకల శుభాలకూ దూరమైపోతారు.[1]

---

*1. ఇది కేవలం మత సంబంధమైన విశ్వాసమే కాదు. దైవప్రవక్త (సల్లం) మదీనా వెళ్ళిన తరువాత అక్కడ స్థాపించిన రాజకీయ వ్యవస్థకు ఇది మొట్ట మొదటి మూలసూత్రం కూడా. విశ్వప్రభువయిన దేవుడే దేశానికి పాలకుడు, చక్రవర్తి; దేవుని ధర్మశాస్త్రమే దేశ చట్టం అనే సిద్ధాంతం పునాది పైన్నే ఈ రాజకీయ వ్యవస్థ నిర్మించబడింది.*

2. మానవ హక్కుల్లో మొట్టమొదటి హక్కు తల్లిదండ్రుల హక్కు. సంతానం తల్లిదండ్రుల సేవ చేయాలి, వారికి విధేయత చూపాలి. వారిపట్ల గౌరవ మర్యాదలు కనబరచాలి. తల్లిదండ్రుల్ని పట్టించుకోని వాతావరణం సమాజంలో ఉండకూడదు. తల్లిదండ్రుల్ని గౌరవించే, వారికి సేవ చేసే సామూహిక వాతావరణం సమాజంలో నెలకొనాలి. మీ బాల్యంలో వారు మీపై ఎలాంటి కరుణావాత్సల్యాలతో ప్రవర్తిం చారో, వారి వృద్ధాప్యంలో మీరూ వారిని అంతకంటే ఎక్కువ ప్రేమతో చూసుకోవాలి.[2]

3. మానవుల సామూహిక జీవితంలో పరస్పర సహకారం, సానుభూతి, ప్రేమ, పరస్పర హక్కుల గౌరవం మొదలగు విషయాలు సదా ప్రతిబింబించాలి. బంధువులు, అగత్యపరులు, బాటసారుల పట్ల తమ బాధ్యతల్ని నెరవేర్చాలి. ఒక బంధువు మరో బంధువుకు సాయ పడాలి. ఒక అగత్యపరుడు ఇతరుల వద్ద తన అవసరం తీర్చుకోగల హక్కుదారుడు కావాలి. ఒక బాటసారి ఏ ఊరికి వెళ్ళినా అక్కడతనికి అతిథిమర్యాదలు సమకూరాలి. మానవులందరిలో హక్కుల పట్ల స్పృహ రావాలి. ఒక మనిషి ఎవరికైనా సహాయం చేస్తున్నాడంటే వారికేదో ఉపకారం చేస్తున్నట్లు కాకుండా వారి హక్కును నెరవేరు

---

*2. ఈ సూత్రం ప్రకారం ఇస్లామీయ సామాజిక వ్యవస్థకు కుటుంబమే పునాది. కుటుంబ వ్యవస్థకు తల్లిదండ్రుల సేవ ఇరుసులాంటిది. తరువాత ధార్మికంగా తల్లిదండ్రుల హక్కులు ఇంకా ఏమేమి ఉన్నాయో హదీసు, ఫికహ్ గ్రంథాల్లో లభిస్తాయి. ఇస్లామీయ సమాజంలో, ముస్లిం ల ఆచారవ్యవహారాల్లో దేవుడు, దైవప్రవక్త తర్వాత విధేయతకు ఎక్కువ హక్కుదారులు తల్లిదండ్రులే అనే విధంగా వారికి శిక్షణ గరపడం జరుగుతుంది. ఈవిధంగా ఇస్లామీయ రాజ్యం తన చట్టాలు, ఆదేశాల ద్వారా కుటుంబ వ్యవస్థను విచ్ఛిన్నం కాకుండా పటిష్టపరచడానికి, పరిరక్షించడానికి పూర్తి కృషి చేస్తుంది.*

స్తున్నాడన్న భావన కలగాలి. ఒకవేళ ఇతరులకు సహాయం చేసే స్థితిలో లేకపోతే, తానా స్థితిలో లేనని మృదువుగా చెప్పి, ఆ స్థితి కలిగించమని దైవాన్ని వేడుకోవాలి.[3]

4. ప్రజలు తమ ధనాన్ని వృధాగా ఖర్చు చేయకూడదు. గర్వం, డాబు, దర్పం ప్రదర్శించడానికి, భోగవిలాసాల్లో విచ్ఛిన్నకరమైన పనులకు ధనం ఖర్చు చేయరాదు. అగత్యపరులు, అవసరార్థుల ఇబ్బందుల్ని తీర్చగల ధనం ఈ విధంగా వృధా చేయడం దైవానుగ్రహాన్ని అపహాస్యం చేయడమే కాకుండా, సత్యాన్ని తిరస్కరించిన దానితో సమానమవుతుంది. "దుబారా ఖర్చు చేసేవారు షైతాను సోదరులు" (17:26). ఇలా దుబారా అవుతున్న ధనాన్ని నైతిక విలువల ద్వారా, నైతిక చట్టాల ద్వారా అదుపు చేయడం సత్సమాజం బాధ్యత.

5. ప్రజలు మధ్యేమార్గాన్ని అనుసరించాలి. ధనాన్ని విచ్చలవిడిగా ఖర్చు చేయకూడదు. అలాఅని పిసినారితనం వహించి ధనాన్ని స్థభింపజేయ

---

*3. దైవప్రవక్త (సల్లం) కాలంలో ఈ అధికరణ (17:28) ప్రాతిపదికపై మదీనా సమాజంలో వాజిబ్ (తప్పనిసరి), నఫిల్ (ఐచ్ఛిక) దానాలకు సంబం ధించిన ఆదేశాలు వెలువడ్డాయి. వారసత్వం, వీలునామా, వక్ఫ్ విధానాలు రూపొం దించబడ్డాయి. అనాధ హక్కుల పరిరక్షణకు ఏర్పాట్లు చేయబడ్డాయి. ప్రతి ఊరూ బాటసారికి కనీసం మూడు రోజులు ఆతిథ్యమిచ్చేలా ఆ ఊరిపై బాటసారికి హక్కులు ఏర్పడ్డాయి. ఇస్లామీయ నైతిక విలువల ప్రభావం వల్ల ప్రజలు చట్టపరమైన హక్కులనే కాకుండా నైతిక విలువల పరంగా హక్కుల్ని నెరవేర్చడమనే విశాల భావనలు వారి మనసుల్లో నాటుకున్నాయి. ఈ ప్రభావం వల్ల చట్టపరంగా ప్రశ్నించలేని, ఇప్పించలేని హక్కుల్ని కూడా ప్రజలు స్వయంగా గుర్తించి వాటిని నెరవేర్చేవారుగా తయారయ్యారు.*

కూడదు (17:29). ధనాన్ని వెచ్చించడంలోనూ, దాని నియంత్రణ లోనూ మధ్యే మార్గాన్ని అనుసరించాలి.[4]

6. దేవుడు ఏర్పాటు చేసిన ఉపాధి వికేంద్రీకరణ వ్యవస్థలో మీరు జోక్యం చేసుకోకండి. ఆయన తన దాసులందరికీ ఉపాధి అవకాశాలు సమానంగా కల్పించలేదు. ఈ వ్యత్యాసంలోని ఉపాయం ఆయనకే తెలుసు. కాబట్టి దేవుడు నిర్ణయించిన విధానాలకు అతిదగ్గరగా ఉండేదే న్యాయమైన ఆర్థిక వ్యవస్థకాగలదు. సహజసిద్ధమైన వ్యత్యాసాన్ని కృత్రిమ వ్యత్యాసంగా మార్చడం లేదా ఈ కృతిమ

---

*4. మదీనా సమాజంలో ఈ రెండు సూత్రాలకు సంబంధించి విభిన్న వివరణ లున్నాయి. ఒకవైపు దుబారా ఖర్చు, విలాసాలను చట్టపరంగా నిషేధిం చడం జరిగింది. రెండోవైపు చట్టాలతో పనిలేకుండా కూడా దుబారా ఖర్చుల్ని అడ్డు కోవడం జరిగింది. మూడోవైపు 'దుబారా' ఎక్కడ ఏరూపంలో జరిగినా ప్రభుత్వం అధికారికంగా ఆపగలదు. ఎవరైనా తమ సంపదను అక్రమ మార్గాల్లో వినియోగిస్తున్నప్పుడు ప్రభుత్వం తాత్కాలికంగా ఆ సంపదను స్వాధీనం చేసు కుంటుంది. అంతేకాకుండా, ప్రజలు శుభకార్యాల్లో, మరేవైనా ఉత్సవాల్లో విచ్చలవిడిగా డబ్బు ఖర్చు పెడుతున్నప్పుడు ఆహా ఓహో..... అనే బదులు ఇలా దుబారా చేస్తున్న వారిని అపహాస్యం చేసేలా, నీచంగా చూసే విధంగా ప్రజల అభిప్రాయాలను మలచడం జరిగింది. దుబారా ఖర్చు పట్ల ప్రజలు స్వయంగా ఆలోచించేలా వారిని తయారుచేయడం కూడా జరిగింది. పిసినారితనంతో పైసా ఖర్చు పెట్టకుండా ధనం కూడబెట్టేవారిని చట్టం ద్వారా కూడా దారిలో పెట్టడం జరిగింది. మిగతా సామాజిక సంస్కరణలు అభి ప్రాయ సేకరణ ద్వారా, నైతికవిలువల ప్రచారం ద్వారా సాధించడం జరిగింది. ఈ కారణంగానే పిసినారులను, విచ్చలవిడి ఖర్చు చేసేవారిని ఈనాటికీ ఇస్లా మీయ సమాజం నీచదృష్టితో చూస్తున్నదంటే అదంతా ఆనాటి సంస్కరణల ఫలితమే.*

వ్యత్యాసాన్ని సహజసిద్ధ వ్యత్యాసపు హద్దులు దాటించి అన్యాయం వరకూ చేర్చడం- రెండూ సరాసరి తప్పుడు విధానాలే.[5]

అయితే దీనికి భిన్నంగా మదీనాలో మానవ సంస్కృతిని నీతి, న్యాయాల పునాదులపై నిర్మించడానికి ఇస్లాం ఓ ప్రత్యేక కార్యాచరణ విధానం అవలంబించింది. దాని ప్రకారం దేవుడు మానవుల సహజ స్థితి యధాతథంగా ఉండాలన్న ఉద్దేశ్యంతోనే వారి మధ్య ఈ వ్యత్యాసాన్ని ఉంచాడు. 3,4,5 అధికరణల ప్రకారం మానవుల మధ్య ఉన్న ఈ ఉపాధి వ్యత్యాసం అన్యాయం, దౌర్జన్యాలకు తావివ్వకుండా ప్రజల నైతిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక ప్రయోజనాలకు సాధనం అయ్యేలా సమాజ చట్టాలను, దాని నైతిక తీరుతెన్నులను సంస్కరించాలి. వీటి కోసమే సృష్టికర్త తన దాసుల మధ్య ఈ ఆర్థిక వ్యత్యాసాన్ని ఉంచాడు.

7. తినేవాళ్ళు ఎక్కువైతే ఆర్థిక ఒనరులు తగ్గిపోతాయన్న భయంతో సంతాన నిరోధానికి పాల్పడటం ఘోరమైన తప్పు. ఇలాంటి భయంతో భావితరాలను హతమార్చుతున్నవారు ఉపాధి ఏర్పాట్లు తమ చేతుల్లోనే ఉన్నాయని భ్రమపడుతున్నారు. నిజానికి మానవుల్ని సృష్టించి వారిని భూమండలంపై నివసింపజేసిన దేవుడే అసలు ఉపాధిప్రదాత. ముందొచ్చిన వారికీ ఆయనే ఉపాధి ఏర్పాట్లు చేశాడు; తర్వాత వచ్చేవారికీ ఆయనే ఉపాధి ఏర్పాట్లు చేస్తాడు (17:31). ఆయన ఏ మేరకు జనాభా పెరుగుతుందో ఆ మేరకు ఆర్థిక ఒనరుల్ని కూడా

---

*5. మదీనాలో సంస్కరణ పనులు ప్రారంభం కాకముందు, ఉపాధి, ఉపాధి అవకాశాల్లోని వ్యత్యాసం తప్పు అనే భావన వేళ్ళూనుకొని ఉండేది. అందు వల్ల న్యాయాన్ని స్థాపించడానికి ఈ ధనిక-పేద అనే తేడాను చెరిపేసి వర్గరహిత సమాజాన్ని సృష్టించడానికి ప్రయత్నించడం ఏదో ఒక స్థాయిలో అవసరమే.*

పెంచుతున్నాడు. కనుక ప్రజలు దేవుని సృష్టిఏర్పాట్లలో మితిమీరిన జోక్యం చేసుకోకూడదు. ఎట్టి పరిస్థితిలోనూ వారిలో శిశుహత్య గురించిన ఆలోచనలు రాకూడదు.[6]

8. వ్యభిచారం స్త్రీ పురుషుల సంబంధాన్ని సూచించే దారుణమైన ఒక వికృత రూపం. ఈ చెడును అంతమొందించడమే కాకుండా, ప్రజలను దాని సమీపానికి గొనిపోయే విషయాలను కూడా నిర్మూలించాలి. (17:32)[7]

9. దేవుని దృష్టిలో మానవప్రాణం ఎంతో పవిత్రమైనది. అన్యాయంగా ఎవరినైనా చంపడానికిగాని, ఆత్మహత్య చేసుకోవడానికిగాని ఎవరికీ

---

*6. పూర్వకాలం నుండి, ఈనాటి వరకు విభిన్న కాలాల్లో ఏ ఆర్థిక పునాదులపై కుటుంబ నియంత్రణ ఉద్యమాలు లేచాయో ఆ పునాదులను ఈ అధికరణ (17:31) ఒక్కదెబ్బతో పెకలించి వేస్తోంది. పూర్వకాలంలో దారిద్ర్య భయమే గర్భస్రావాలకు, శిశుహత్యలకు ప్రేరణగా ఉండేది. ఆ ప్రేరణ ఈనాడు మరో అడుగు ముందుకు వేసి ప్రపంచాన్ని గర్భనిరోధన వైపుకు నెట్టి వేసింది. అయితే 'మేరాజ్ సందేశం'లోని ఈ అధికరణ 'తినేవారి సంఖ్యను తగ్గించాలనే విచ్ఛిన్నకరమైన ప్రయత్నాలను వదలి, ఆహార ఒనరులను పెంచే నిర్మాణాత్మక ప్రయత్నాలలో తమ శక్తిసామర్థ్యాలను వినియోగించాలని మానవులకు ఉప దేశిస్తోంది. ప్రపంచంలో అపారంగా ఉన్న ఉపాధి అవకాశాలను విస్తరించ డానికి ప్రయత్నించమని చెబుతోంది.'*

*7. ఈ అధికరణ చివరికి ఇస్లామీయ జీవన వ్యవస్థలోని ఓ పెద్ద అధ్యాయానికి పునాదిగా మారింది. దానికనుగుణంగా వ్యభిచారం, వ్యభిచార నిందలు చట్ట పరమైన నేరాలుగా పరిగణించబడ్డాయి. పరదా ఆదేశాలు జారీ చేయబడ్డాయి. అశ్లీల ప్రచార ప్రచురణలపై ఆంక్షలు విధించబడ్డాయి. మద్యం, సంగీతం, నాట్యం, చిత్రాలపై కూడా ఆంక్షలు విధించబడ్డాయి. వివాహాన్ని సులభతరం చేసే దాంపత్య చట్టాలు చేయబడ్డాయి. సమాజంలో వ్యభిచారం వైపు గొనిపోయే దారులన్నీ మూసివేయబడ్డాయి.*

ఎలాంటి అధికారం లేదు. తనకు వ్యతిరేకంగా ఏదైనా దైవనిర్ణీత హక్కు అమలు జరిగి నప్పుడు తప్ప మనిషి దేవుడు నిర్ణయించిన ఈ నిషేధాలు అతిక్రమించడానికి వీల్లేదు. శిక్షలు దేవుడు నిర్ణయించిన మేరకే విధించాలి. (17:33). వాటి పరిధుల్ని ఉల్లంఘించకూడదు. ఉదాహరణకు- ప్రతీకారంతో రగిలిపోతూ నేరస్తుడితో పాటు ఇతరుల్ని కూడా హతమార్చడం, నేరస్తుడ్ని చిత్రహింసలు పెట్టి చంపడం, చంపిన తర్వాత శవాన్ని అగౌరవపరచడం వంటి చేష్టలు.[8]

10. అనాథలు తమ కాళ్ళ మీద నిలబడగలిగే స్తోమతకు చేరుకునే వరకు వారి ప్రయోజనాలను కాపాడుతూ ఉండాలి. (17:34) వారి సంపదలో వారి ప్రయోజనాలకు నష్టం కలిగించే ఎలాంటి ఖర్చులు చేయకూడదు.[9]

---

*8. ఈ అధికరణ ప్రకారమే ఇస్లామీయ చట్టంలో ఆత్మహత్య నిషేధించబడింది; ఉద్దేశ్యపూర్వకమైన హత్య నేరంగా పరిగణించబడింది. హత్యకు సంబంధించిన వివిధ రూపాల కోసం రక్త పరిహారం, ప్రాయశ్చిత్తం వంటి పద్ధతులు ప్రతిపాదించడం జరిగింది. న్యాయపరమైన హత్య మూడు పరిస్థితులలో మాత్రమే చట్టసమ్మతం అవుతుందనే షరతు విధించబడింది. ఒకటి, ఉద్దేశపూర్వకంగా హత్య చేయడం. రెండు, వ్యభిచారానికి పాల్పడటం. మూడు, ఇస్లామీయ పాలనా వ్యవస్థకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయడం. ఈ హత్యానేరాలను గురించి విచారణ జరిపి శిక్షలు విధించే అధికారం షరిఅత్‌పరమైన న్యాయమూర్తికి మాత్రమే ఉంటుంది. దీనికి సంబంధించి ఒక మంచి నియమావళి కూడా రూపొందించబడింది.*

*9. ఇదొక నైతిక ఉపదేశం మాత్రమే కాదు. అనాథల హక్కుల రక్షణ కోసం ఇస్లామీయ ప్రభుత్వ వ్యవస్థలో చట్టపరమైన, పాలనాపరమైన ఏర్పాట్లు కూడా చేయబడ్డాయి. హదీసు, ఫికహ్ గ్రంథాల్లో వీటికి సంబంధించిన వివరాలు ఉన్నాయి. తమ ప్రయోజనాలను తాము కాపాడుకోలేనివారి ప్రయోజనాలను ప్రభుత్వం కాపాడేందుకు కావలసిన విస్తృత సూత్రాలు కూడా ఇదే అధికరణ నుండి రూపొందాయి. "సంరక్షకులు లేని అనాథలకు నేనే సంరక్షకుడ్ని"*

11. చేసిన ప్రమాణం, వాగ్దానాలను నెరవేర్చండి. ఒక మనిషి మరో మనిషికి చేసిన వాగ్దానమైనా, ఒక జాతి మరో జాతికి చేసిన వాగ్దానమైనా నిజాయితీగా నెరవేర్చాలి. ప్రమాణం, వాగ్దానాల విషయంలో దేవునికి జవాబు చెప్పుకోవాల్సి ఉంటుంది. (17:34)[10]

12. తూనికలు, కొలతలు, కొలమానాలు సవ్యంగా ఉంచండి.(17:35) ఇచ్చిపుచ్చుకోవడాల్లో తూనికలు, కొలతలు సరిగా ఉంచండి.[11]

13. మీకు తెలియని విషయాల్లో అనవసరంగా తలదూర్చకండి. మీ కళ్ళు, చెవులు, హృదయంలోని ఆలోచనలు, సంకల్పాలను గురించి దైవానికి సమాధానం చెప్పుకోవాల్సి ఉంటుంది (17:36).[12]

---

*అనే ప్రవక్త ప్రవచనం కూడా ఈ విషయాన్ని సూచిస్తోంది. ఇది ఇస్లామీయ చట్టంలోని ఒక పెద్ద అధ్యాయానికి పునాదిలాంటిది.*

*10. ఇది కూడా కేవలం ఇస్లామీయ నైతిక సూత్రావళికి సంబంధించిన గొప్ప అధికరణ మాత్రమే కాదు. ఇస్లామీయ ప్రభుత్వం మరికాస్త ముందుకెళ్ళి ఇది తన దేశ, విదేశ రాజకీయాలకు పునాదిరాయిగా చేసుకుంది.*

*11. ఈ అధికరణ ప్రకారం ప్రభుత్వ గణాంక శాఖపై మార్కెట్లలో తూనికలు, కొలతలకు సంబంధించిన పర్యవేక్షణ బాధ్యత మోపబడింది. ఈ సూత్రం ఆధారంగానే వ్యాపార, ఆర్థిక లావాదేవీలలో జరిగే దగా, దోపిడీలను అరికట్టే బాధ్యత కూడా ప్రభుత్వంపై మోపబడింది.*

*12. ఈ అధికరణ ప్రకారం ముస్లింలు తమ వ్యక్తిగత, సామూహిక జీవితాల్లో లేనిపోని అనుమానాలు, ఊహాగానాలతో పనిచేయడానికి బదులు విషయ పరిజ్ఞానం ఆధారంగా పని చేయాలి. నీతినడవడికలు, దేశ చట్టాలు, పరిపాలనా వ్యవహారాలు, రాజకీయాలు, విద్యావిధానాలు వగైరా సమస్త రంగాలకు వివిధ రూపాలలో భారీఎత్తున ఈ అధికరణను వర్తింపజేయడం జరిగింది. లేనిపోని అనుమానాలు, ఊహాగానాల కారణంగా సమాజంలో వ్యాపించే వివిధ చెడులను ఈవిధంగా ఆనాడు ఈ అధికరణ ద్వారా అరికట్టడం*

14. భూమిపై నిక్కుతూ, నీల్గుతూ నడవకండి (అహంకారంతో). మీరు భూమిని చీల్చి వేయనూలేరు. పర్వతాల ఎత్తుకు ఎదగనూ లేరు. (17:37)[13]

మహాప్రవక్త ముహమ్మద్ (సల్లం) మదీనా వలస పోయిన తరువాత ఈ సూత్రాల ప్రాతిపదికపైన్నే అక్కడ ఇస్లామీయ సమాజాన్ని, ఇస్లామీయ రాజ్యాన్ని స్థాపించారు.



---

*సాధ్యమయింది. నైతిక వ్యవహారాల్లో లేనిపోని అనుమానాలకు పోయి పరిశీలన, పరిశోధనలు చేయకుండా ఏ మనిషిపైగాని వర్గంపైగాని నిందారోపణలు చేయకూడదని, వదంతులు వ్యాపింపజేయకూడదని ఉపదేశించడం జరిగింది. అలాగే కేవలం అనుమానం కారణంగా ఏ ఒక్కరికీ వ్యతిరేకంగా చర్యలు తీసుకోకూడదని దేశ చట్టంలో ఒక శాశ్వత సూత్రం నిర్ణయించబడింది. నేరాలకు సంబంధించిన విచారణ, ఇంటరాగేషన్‌ల విషయంలో కేవలం అనుమానంతో ఎవరినీ పట్టుకోవడంగాని, కొట్టడంగాని, జైళ్ళలో పడవేయడం గాని చేయకూడదని ఒక నిబంధన నిర్ణయించబడింది. విద్యావ్యవస్థ విషయంలో అనుమానం, అంచనాల ఆధారంగా రూపొందిన విద్యాజ్ఞానాలు స్వీకారయోగ్యమైనవిగా పరిగణించబడ లేదు.*

*13. ఇందులో ముస్లింలు పాలకవర్గంగా మారిన తర్వాత కూడా గర్వం, అహంకారాలను దరిచేరనివ్వకూడదని సూచించడం జరిగింది. ఈ హితవుల ప్రభావం వల్లనే ఆనాటి పాలకులు, సేనాపతుల మాటల్లోగాని, చేతల్లోగాని ఏమాత్రం గర్వం వ్యక్తం కాలేదనడానికి గత చరిత్రే సాక్ష్యం. ఆనాడు ముస్లింలు విజేతలుగా ఏదైనా నగరంలోకి ప్రవేశించినప్పుడు కూడా డాబు, దర్పాలను ప్రదర్శించలేదు.*